# బాపురెడ్డి గేయాలు

జె. బాపురెడ్డి

ప్రచురణ:

సుఖేలా నికేతన్

హైదరాబాదు

తొలి ముద్రణ
జనవరి, 1968



నాట్యకళ ప్రె
హైదరాబా



వెల : రూ 3/-

ప్రతులకు :
సుఖేలా నికేతన్
I. C. ౮5, ఇర్రం మంజిల్ కాలనీ,
హైదరాబాదు–౮4

# ఆత్మ శ్రుతి

పసి యెండలో మిసమిసలాడుతూ
పరవళ్లు తొక్కే సెలయేరును చూశారా?
పసిమి వెన్నెల్లో కొసరికొసరి దృశాంచలాలు
విసిరే కలువరేకుల్ని చూశారా?
చూస్తే సరి. చూడకుంటే ఇటు చూడండి.
ఆ సెలయేటి రూపు
ఆ కలువపూల చూపు
వెరసి చిరంజీవి బాపు (రెడ్డి).
వ్యక్తిగా బాపురెడ్డి మూర్తి ఇది.
మరి — కవితా శక్తిగా అతని కీర్తి ఎలాంటిది?
అది జారక దశను దాటింది.
కోరక దశను మీటింది.
ప్రసూన దశలో పదం మోపింది.
ఇది అతని మూడో కవితా సంపుటి.
మొదటిది 'చైతన్య రేఖలు'
రెండోది 'రాకెట్టు రాయబారం'.
కవి పేరే ఈ కృతి పేరు.

## 2

దీంట్లోని పికరుతులు ఒక కొమ్మవి కావు
వేరు వేరు.
అయినా అన్నిటిలో అనుస్యూతంగా ఉన్నది
ఒకే కాకలి,
కవిత్వపుటాకలి.
ఈ సంపుటిలో ఉన్న ఖండికలు భిన్నభిన్నమైనవి.
అలవోకగా వ్రాసినవి
ఆకాశవాణికి శ్రుతిచేసినవి
పత్రికలకోసం చెప్పినవి
మిత్రులకోసం గుప్పినవి
ఉద్యోగరీత్యా పలికినవి
హృద్యోగరీత్యా చిలికినవి
ఎన్నెన్నో భావమధు ధారలు కలిసి
ఏకమైన కలశి.

## 2

బాపురెడ్డి అచ్చంగా కవి.
కవీతర పదవుల్ని (సాహిత్యరంగంలో) ఆక్రమించి
తాను గజిబిజిపడి
పాఠకుల్ని గడబిడ పెట్టే
కవి పండితుడూ కాడు
పండిత కవీ కాడు.
చూసిన ప్రతి వస్తువునూ
కల్పనా చక్షువులతో పరికించి చూడగల

## 3

భావనా రసనతో చవిచూడగల
గుప్త సత్యాలకు లిప్తలో తెరతీయగల
తెరవెడలిన రసాత్త భావాలకు
శబ్ద శాద్వలాలు పరిచేయగల
మౌలిక ప్రతిభ ఉన్నవాడు.
సమకాలీన కవుల ప్రభావం కుత్తుకబంటిగ ఉన్నా
గమ్మత్తుగా తప్పించుకుని
ఆ మహా ప్రవాహాన్ని ఉత్తరించి బయటపడే
నేర్పూ, అందుకు తగిన కూర్పూ ఉన్నవాడు.
చల్లకు వచ్చి ముంత దాచడ మెందుకు ?
చూడండి 'నీవూ - నేనూ'.

## 3

"నీవూ — నేనూ"

"నీ కన్నుల వెలుతురులో
నే కన్నులు తెరిచాను,
కనులు తెరిచి నేనిది భూ
లోకమనే మరిచాను."

ప్రేయసి కనుల వెలుగులో ప్రియుని కనులు తెరుచుకున్నవి.
తెరుచుకున్న కనులు అలాగే ఉండిపోయినవి.
అతడున్నది భువిలో.
అందుకు పర్యవసానం ?
నిమిషంలో కళ్ళు మూతపడాలి.
కాని అలా జరగలేదు.

# 4

ఆ కళ్లు అలాగే విస్ఫారితంగా ఉండిపోయినవి
అంటే అతడు అనిమిషుడైనా డన్నమాట.
'అనిమిష' పదం ఉచ్చరించకుండా ఆ వ్యంగ్యార్థం
భాసించే మాటలకు ఈ చరణం ఆభరణం.

"నీ పెదవులు కరచినాను
నను నేనే మరచినాను
మరచి ఇంద్రలోక సుధా
మాధురిలో నిలచినాను.'

'అధరం సుధా మధురం' అని చెప్పలేదు కవి.
కాని చెప్పినంత పని చేశాడు భంగ్యంతరంగా.

(అయితే కరవడం దాకా వ్యవహారం జరగడం
కవి కరకు వయసుకు చెరగని చిహ్నం.
అది విషయాంతర మనుకోండి.)

"నీ నడుమును చుట్టినాను
నింగికొసలు ముట్టినాను
ప్రణయ కళాక్షేమ తేలి
పంచాస్త్రుని కొట్టినాను."

ఈ పంక్తుల్లో ఉన్న వ్యంగ్య వైభవం
పరిణత కవులతో కేలు కలిపేది.

ఆమె నడుమును చుట్టితే
ఆకాశం ముట్టినట్లయిందట.

ఈ ఊహ ఎంత ఎత్తయిందో అంత లోతయింది.
ఆకాశాన్ని తాకడంలోని యెత్తు
అత్యంత పారవశ్యానికి గుర్తు.
అంతే కాదు—

ఆకాశం శూన్యం.

ఆమె నడుము అంతకంటె శూన్యం.

('నడుమే పసలేదుగాని నారీ మణికిన్' అని ఊరికే అన్నాడా
ప్రబంధకవి.)

ఆమె నడుమును చుట్టి వేయడమంటే

ఆకాశాంచలాల్ని ముట్టి వేయడమే కదా!

అందుకే అన్నాను ఈ ఊహ ఎంత ఎత్తయిందో
అంత లోతయిందీ అని.

ఈగీతంలో ఉన్నవి అయిదే అయిదు చరణాలు.

ఇవి అయిదు చరణాలు కాదు

అనంగుని అయిదు శరాలు.

తలచినకొద్దీ పులకలు.

వలపు జంటలకు మెయిమలకలు.

ఇంతటితో 'ఆత్మశ్రుతి' ముగుస్తున్నది.
ఇన్ని గేయాల్లో ఈ ఒక్క గీతానికే
శ్రుతి చేసి మిన్నకుంటున్నాను.
ఇందుకు ఒకే ఒక్క హేతు వుంది.

బాపురెడ్డికీ నాకూ ఉన్న అనుబంధం ఎలాటిదంటే

అతణ్ని గురించి ఇంక ఏమాత్రం విస్తరించినా

ఈ ఆత్మశ్రుతి ఆత్మస్తుతిగా పర్యవసిస్తుందేమో ?

బాపురెడ్డి మిగతా గేయాల్లోని
తీపిని ఆస్వాదించే మధువ్రతులకు స్వాగతం.
సెలవు.

సి. నారాయణరెడ్డి

# మా మాట

భూత కాలము పెరిగి నట్టా ?
భావి కాలము తరిగి నట్టా ?
నూత నాబ్దో దయము నీ అను
భూతిలో ఏ గతి రహించు నో ?
ఓ స్వరాట్ కవి సమ్రాట్ — కొను
మోయి నా ఈ శుభా కాంక్షలు !
నీ కళా క్షేత్రమున పండును
గాక నవ్యాక్షర ద్రాక్షలు !

1963 నూత్న వర్షోదయ శుభక్షణంలో, నెదర్లాండ్సు (ఐరోపా) నుంచి, బాపురెడ్డి గారు ఇక్కడ భీమన్న గారికి పంపిన ఆకాంక్షా గేయ మంజరి ఇది. ఈ ఒక్క మంజరీ చాలు బాపురెడ్డి గారి కవితా సామ్రాజ్య విస్తరాన్ని వివరించడానికి.

తాను స్వరాట్ అయిన వాడే మరొకరిని సమ్రాట్ చేయ గలడు. బాపురెడ్డి గారు కవితా స్వరాట్. ఆ విషయాన్ని ఆధునిక కవితా మహా ప్రభువైన డాక్టరు సి. నారాయణ రెడ్డిగారు తమ ఆత్మశ్రుతిలో నిరూపించారు.

అడిగిన వెంటనే, అవ్యవధిగా, నిమిషాల మీద ఈ కృతికి

ఆత్మస్తుతి సమకూర్చి ఇచ్చిన నారాయణ రెడ్డిగారికి మేం చాల కృతజ్ఞులం. పీఠికలో, పరిచయాలో వ్రాయడానికి అంగీకరించి, కవుల్ని నెలల తరబడి ఇండ్ల చుట్టూ తిప్పుకొనే మహామ భావు లెందరో ఉన్నారు. అట్టి వారందరికీ నారాయణ రెడ్డిగారు వెలుగు బాట చూపించారు ఈ రంగంలో కూడ.

బాపురెడ్డి గారు కవి. కవి అంటే వైదికార్థం పరబ్రహ్మ. మూల సృష్టి చెయ్యగలిగిన వాడే పరబ్రహ్మ. కవితా రంగంలో మూల సృష్టి చెయ్యగలిగిన వాడే కవి. ఆనంద రసార్ణవం నుంచి కొత్త కాలువలు తీసి, కొత్త పంటలు పండించే వాడే కవి. కవిత క్షేత్రజ. భూజాత. సీత. కవిజనకుడు. అందుకే కాబోలు— తన కవితా సీతను కృతిఇస్తూ, భీమన్న గారిలో కోదండ రాముణ్ని చూచు కొన్నారు బాపురెడ్డి గారు.

కవిత ప్రతిభా క్షేత్రజ. పాండిత్య కర్మాగారాలలో తయా రయ్యే విలాస వస్తు సామగ్రి కవిత కాదు. అనువాదాలు, నినా దాలు, నీతులు, నిష్ఠలు, మాటల ట్రిక్కులు, ప్రాసల ఫీట్లు, పిచ్చి తిట్లు తప్ప మూల సాహిత్యం మృగ్యమైన తెలుగులో బాపురెడ్డిగారి వంటి యువకులు సాహితీ సృష్టికి పూనుకోవడం ఎడారిలోకి గంగా తరంగిణి ప్రవహించడం. ఇది ఇక సుజలాం, సుఫలాం, సస్యశ్యామ లాం కావాలని మా ఆకాంక్ష.

మహా కావ్యాల రోజులు కావివి. కావ్యాలు, ప్రబంధాలు, మహా కావ్యాలు గత కాలపు చిహ్నాలు. ఇంత వరకూ ఉన్నవి చాలు. వాటి నమూనాలో క్రొత్తవి అక్కరలేదు. ఇప్పుడు మనకు కావలసి నవి వినూత్న వేదాలు. సన్మానాలను, సభా మర్యాదలను, పైరవీలను, పండిత ప్రశంసలను, డబ్బును, డాబుసరితనాన్ని ఆశించి వ్రాసే గ్రంథాలు సాహిత్యం కాదు. ఇప్పుడు మన సారస్వత రంగంలో

ప్రబలంగా ఉంటున్నది ఉబ్బే కాని, బలుపు కాదు. ఇది యువ రచయితలు గుర్తించవలసిన పరమ సత్యం.

ఇప్పుడు మనకు కావలసినవి వినూత్న వేదాలు. బాపురెడ్డి కవి. ఆయన పలికే ప్రతి వాక్కూ ఒక ఋక్కు. దేశకాల పాత్రానుగుణంగా ప్రవహించి వస్తున్న గంగా తరంగిణి ఆయన కవిత. సనాతన మహా సరస్వతి ఆయన నుంచి మళ్ళీ వ్యక్తీభూత అవుతున్నదా అనిపిస్తుంది — ఆయన ధోరణి గమనిస్తే.

ఈ కృతి బోయి భీమన్న గారికి అంకితం. కృతి కర్త, కృతి భర్త ఇద్దరూ ధన్యులు. ఇద్దరూ కవులు. ఒక కవి కృతి ఒక కవికి శ్రుతి. ఇద్దరూ కవులు. ఇద్దరివీ శ్రుతులు.

బాపు రెడ్డిగారి ఈ గేయ కవితా శ్రుతిని ప్రకటించ గలుగుతున్నందుకు మేం ఎంతో ఆనందిస్తున్నాం. ఆయనకు చాల కృతజ్ఞులం.

ఉన్నత పరిశోధనా వ్యాసంగంలో, నెదర్లాండ్సు కేంద్రంగా, ఐరోపా పర్యటన జరుపుతున్న బాపురెడ్డిగారు అక్కడి నుంచి అంకిత గేయంతో పాటు ఇంకా కొన్ని అద్భుతమైన గేయాలు పంపించారు. వాటన్నిటినీ ఈ కృతి పునర్ముద్రణలో చేర్చగలం. అసలు, బాపురెడ్డిగారు అక్కడి నుంచి మిత్రులకు వ్రాస్తున్న లేఖలే ఒక ప్రత్యేక సాహిత్యం. వాటి మాట తర్వాత.

ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన నాట్యకళ ప్రెస్ వారికి, ఈ విషయంలో మాకు తోడ్పడిన యాదగిరిరెడ్డి, గిర్‌గ్లాని, జగ్గారెడ్డి, గిడుగు రామమూర్తి, చిత్ర శిల్పి పి. ఆర్. రాజు, అరిపిరాల విశ్వంగార్లకు, తదితర మిత్రులకు మా నమస్సులు.

సుఖేలా నికేతన్

# కావ్య కల్యాణం

నీవు వరుడ వగుటకు ఏ
దేవతలను కొలిచి నదో
నా యీ నవ కావ్య వధువు
ఓయి బోయి భీమన్నా ! ॥నీవు॥

పాండిత్యము, రస తత్త్వము,
ప్రగతి సాహితీ సత్త్వము

ఆకృతి గొన్నట్టి అక్షు
రాకారా ! సాకారా ! ॥నీవు॥

గోదావరి తీరములో
గోపాలుడ వై పుట్టి,
ప్రకృతి దేవి ఒడిబడిలో
పంచాక్షరి వై నట్టి ॥నీవు॥

జ్ఞాన పదుల జాగృతికై
జాబులు పంపించితివి,
మధు బాలకు రాగోదయ
మధు గీతలు మప్పితివి ॥నీవు॥

పాలేరును ప్రభువు చేసి,
కూలీనే రాజు చేసి,
సభలు చేసి భావ దీప
విభవము చూపిన వాడా ! ॥నీవు॥

ఆరు ఋతువు లందలి ప్ర
హ్లాద రాగ మధువు తీసి
ఏడవ ఋతువును చేసి
ఏలిన రస లోకేంద్రా ! ॥నీవు॥

ప్రబల భావనా రాకెటు
పై అనాది కొస నుండి
అనంత త్వ మెల్ల ప్రద
క్షిణ చేసిన రాగ ఋషీ ! ॥నీవు॥

## 11

కొండలు, మానవ లోకపు
గుండెలు చైతన్య సుధా
భాండము లౌన ట్లుకాండ
తాండవ మొన రించు నట్టి ॥నీవు॥

సకల తత్త్వ సారామృత
సంభరిత కళా కలశీ
వైతాళిక గాగ రాగ
వైశాఖిని విరియించిన ॥నీవు॥

ఇది నా భావ తరంగిణి,
ఇది నా గే యోత్పలిని,
కల శోదధి కళా నిధీ !
కల్యాణము కమ్ము సుధీ ! ॥నీవు॥

ప్రతిభా కోదండ రామ,
ప్రగతీద్ధ గదా భీమా !
భారతికై సర్వస్వము
ధార పోయు గుణధామా ! ॥నీవు॥

మేలుకో మదను రాగ
శ్రీ విభాత శ్రుతి గీతను !
పలుకో మదను భూతి
జ్ఞా జాతను కృతి సీతను ! ॥నీవు॥

బా పు రె డ్డి

# కావ్య స్వీకారం

పూర్వ జన్మము లోన ఏ యే
పుణ్యములు పండించి నానో,
దివ్యమౌ నీ సాహితీ బాం
ధవ్య మధువు లభించె నాకు !
పరిమళమ్ముల పసిడికడ్డీ !
బాపురే శ్రీ బాపురెడ్డీ !

సూర్య తీక్ష్ణము నీదు ప్రతిభ,
చంద్ర లలితము నీదు గుండె,
నీదు సఖ్యము ప్రణయ ముఖ్యము,
నిత్య నవ సాహిత్య చైత్రీ
పారిజాతపు తోట నీది !
బాపురే ఓ బాపురెడ్డీ !

వాణి వీణా వాద కంకణ,
వేణు నాదా మోద కింకిణి,
నీ మనో భూజాత కవిత
నా మనోహారి యైన చరిత
పలుకు చెలి పల్కులకె జేజే !
బాపురే జే బాపురెడ్డీ !

బోయి భీమన్న

# ... అమృతగళం

అబ్బా ! ఎన్నాళ్ళకు నీ
అమృతగళము విననాయెను !
కోటి రాగ వీణ లొకే
మాటు మీటి నటులాయెను !

రక్త సంధ్యలోన ఉష
శ్రీ లలాట రాగవల్లి
ఎడతెగని ఎడారిలోన
ఎక్కడిదీ పాలవెల్లి !

# 3. విపద్గీతి

నవ వసంతానివై
అవతరించెద వంచు
నా బ్రతుకు తోట ని
న్నాళ్లు పెంచితినే !
స్నేహానిలములతో
చిరునవ్వు విరులతో
విరహ శిశిరము నుండి
విడిపించు నను చెలీ !

ప్రేమ రసవృష్టి కురి
పింతువని ఆశించి
యౌవనీ ! నా తరుణ
యౌవన క్షేత్రాన
చల్లితిని మంజులా
శయ బీజముల నెన్నో
ఈ ప్రవాసపు టనా
వృష్టి కడతేర్చవే !

విడిపోని నీ వలపు
బిగి కౌగిళుల కూర్చి
రస రాగ మధుర స్వ
ర్గము ప్రసాదింతువని

దేవతల కాదు; నా
దేవి నిను కొల్చితిని,
ఎడబాటు నరకాన
పడియుంటి విడిపించు!

నీ అందియల పాట
నీదు గాజుల మాట
విననెంచి మరి యేది
వినకుండ నీ మీదె
నిల్పితిని ధ్యానమ్ము
నీరవ స్థితి నుంటి
శ్రుతినించు సఖియ! నా
శూన్య జీవితములో!

కల్పించి వ్రాసినది
కాదు ఈ కావ్యమ్ము
కాలిపోయెడి గుండె
జాలి మొరలే ప్రియా!
దళిత జీవిత విప
త్కాల గానము ప్రియా!
శరణాగతుడ నేను
కరుణించి రక్షించు!

# ౭. ప్రియాలాపం

కటికనేల నడిచి నడిచి
కందిన నా పాదమ్ములు
ఎఱ్ఱ గులాబీ లై పోయెనురా !
ఎఱ్ఱ గులాబీ లై పోయెనురా !

ఈ యవ్వన భారమ్మును
మోయలేక నా నడుము
తరిగి తరిగి కరిగిపోయె కదరా !
తరిగి తరిగి కరిగిపోయె కదరా !

చీకట్లను చించి చీల్చి
నీ కోసం వెదకి వెదకి
నా కన్నులు కాటుక లై పోయెనురా !
నా కన్నులు కాటుక లై పోయెనురా !

నిన్నే మదినిల్పి చేయు
చున్న ప్రేమ తపసున నా
జడలు మడమలంట పెరిగిపోయెనురా !
జడలు మడమలంట పెరిగిపోయెనురా !

నా నిట్టూర్పుల వేడిమి
లోన మసలి మసలిన నా
బుగ్గ లగ్గి బంతులై పోయెనురా !
బుగ్గ లగ్గి బంతులై పోయెనురా !

తాపముతో నీవు రాని
కోపముతో కొరుకుకొన్న
నా పెదవులు కుంకుమ పూలాయెనురా !
నా పెదవులు కుంకుమ పూలాయెనురా !

నా వలపులు నా తలపులు
నీ కొరకై వేచి వేచి
గుండెమీద గుడులు కట్టుకున్నవిరా !
నా గుండెమీద గుడులు కట్టుకున్నవిరా !

ఊహాలతో ఊగి తూగి
ఉండలేక దొరలిన నా
తనువెల్లను వంపులు పడిపోయెనురా !
తనువెల్లను వంపులు పడిపోయెనురా !

# ౩. ఎవరికోసం

ఎవరికోసం నేను
ఇల కవతరించానో ?
ఎవరికై ఈ బ్రతుకు
చివుకనీ కున్నానో ?

ఎవరికై కలలు రే
బవలు కంటున్నానో ?
ఎవరికై ప్రతిది పా
టే అల్లి పాడుదునో ?

ఎవరికై దశ దిశల
కెగసి చూస్తున్నానో ?
ఎవరికై వెర్రినై
ఇరులు త్రాగెదనో ?

నా కోసమైతే కా
నే కాదు దేవీ !
ఓ కాంతి గర్భ ప్రా
గా కాశ భావి !

# 7. నిరుపమాన

ఏ మంచు పేరిడుదునో నీకు చెలియా !
ఏ మంజు గీతాల నిను కూర్తునే ప్రియా !
నీ ముందు తన మందహాసాల రుచి మాయ
ఆ సరోజిని ముఖము ముకుళించెనే !

నీ నుదుటి ప్రణయ కుంకుమ కాంతులను జూచి
సిగ్గిల్లి తారమ్మ కారుమబ్బుల దూరె !
నీ కుంతల వినీల కాంతితరగల జూచి
ఆ సునంద మిళింద బాల ముసుగు బిగించె !

ఆ వీణ నీ గానమున మ్రోగలేక
సాగి తీగెలు తెగగ మూగవడిపోయె !
పతిలేని మతిలేని రతిరాణి నిను జూచి
"బ్రతుకేల నాకు" అని చితి కూర్చుకొన జూచె !

లక్ష్మి సరస్వతి ఉషస్విని సత్కళల
మిళితమున సుదినమున సృజియింపబడినావో ?
ప్రకృతి హస్తాలతో చంచలా డోలలో
మైమరచి మన మూగు చుందమే,
యుగయుగాలుగ వెలుగు చుందమే.

# 8. భవిష్యద్దర్శనం

ఈ జగత్పరిణామ గతి ఎం
తెంత వడిగా సాగుచున్నది !
మానవుని జీవిత పథమ్ములు
మాటిమాటికి మారుచున్నవి !

మానవుని జిజ్ఞాస కాంతి మ
హానదీ డోలికల తేలును,
యుగ యుగమ్ములు గడిచి రాతి
యుగము రాకెటు యుగము చేరెను.

ఒక శతాబ్దానంతర నరుం
డూహ వలె నా కనుల మెరయును,
తన విసూత్న విచిత్ర జీవిత
మును క్షణము కన్పరచి పోవును.

అతడు విజ్ఞానంపు టంచుల
నధిగమించుచు నుండెనో యన
అంతరిక్ష దిశాంతముల మెరు
పై చరించును విజృంభించును.

చంద్రబింబ సుధాంకమున తా
చకోరమ్మై చేరి కూర్చొని
విమల పద్మమువలె ఇలా గో
ళమును గని హర్షించి మించును.

దేశముల విభజించు ఎల్లలు
మాసిపోవును అతని చూపుల,
మానవుని బాధించు స్వార్థో
న్మాదములు నశియించు నా యెద.

వానరుడు దానవుడు నగు మన
మానవుడె సురుడుగా కన్పడు,
అతని దృష్టికి తిండి గుడ్డలు
అల్ప విషయమ్ములుగ కన్పడు.

సర్వ మండలములను తన వా
సమ్ము చేయు ప్రయత్న మతనిది
సృష్టి మూల రహస్యమును గను
దృష్టి చేకొను యత్న మతనిది.

లేమి యే అతనికి ఉన్నటు
లేదు లే దింకొకరి బలిమి,
గడియ కృషి చేసిన నె అతడు
పడయు వలసినయంత కలిమి.

క్రాంతికై అతడు తపించు
శాంతి సుఖముగ ధరవసించు
మనకు అతనికి ఎంత భేదము
కనుపడు నోహో ! కాలమహిమ !

అదిగో ఇరువది యొక శతాబ్ద
మ్మందు మనిషి మహానుభావుడు !
చూడు మాతని బ్రతుకు ఎంతటి
సుందరమ్మో, ప్రచలితమ్మో !

# ౬. మార్గదర్శి గురజాడ

నూరు వత్సరములకు పూర్వము
భారతీ జీవితకళా సం
జీవిగా, గురజాడ అప్పా
రాయ ! వెలసితివి !

పుట్టగానే పరిమళించిన
పూవువై, సాహిత్యసుగతిని
నిత్యనూతన సౌరభమ్ముల
నింపి పోయితివి !

దేశమంటే మట్టి యనుకొని
మోసపోయిన భరతజాతికి
దేశమంటే మనుషులని సం
దేశ మిచ్చితివి !

ఆడబిడ్డల అమ్ముకొను సం
ఘమ్మునకు తగు బుద్ధి చెప్పగ
సృష్టి చేసితివయ్య "కన్యా
శుల్క" నాటకము !

ఛాందసముపై గ్రాంధికముపై
సాంఘిక దురాచారములపై
కత్తిగట్టి తెలుంగు జాతికి
ఖ్యాతి గూర్చితివి !

వేషభాషలు మార్చి మోసము
చేసి బ్రతికే స్వార్థపరులు
న్నంత కాలము మరువగలమా
నీ గిరీశమును ?

ప్రభువులకు ప్రాణ మిత్రుడవై
ప్రజలకు ప్రాణ మిచ్చితివి,
లక్ష్మి కాదని నవ్యవాఙ్మయ
లక్ష్మి గొల్చితివి !

నీవు పుట్టిన రాయవరము
నీవు మెట్టిన విజయనగరము
నీ యశస్సు విధాననే ఎ
న్నేళ్ళయిన నిల్చున్.

నాల్గు కోట్ల తెలుంగు ప్రజ లీ
నాడు తమ "జాతీయకవి" నీ
వే యటంచును దశదిశల ఎ
లెత్తి పాడుదురు.

అఖిల మానవ హృదయ సీమల
ఆవరించిన నీ మహాత్మకు
ఏమి ఇత్తును, నీకు నచ్చే
ఈ 'సరాలు' వినా ?

......................
......................
......................
......................

# 10. పరిణామం

పద్యానికీ గద్యానికీ మధ్య
ప్రాచీనులు పెట్టిన గోడలు
నేడో రేపో పూర్తిగా
నేలమట్టం కావచ్చు.

దేశానికీ దేశానికీ మధ్య
ద్వేషాలు పెంచే తత్వం
అంతమయ్యే కాలం యింకా
ఎంతో దూరం లేదనొచ్చు.

దేశానికీ కాలానికీ మధ్య
తేడా తొలగించే జ్ఞానం
త్వరలోనే వశం కావడం
తధ్య మనే చెప్పవచ్చు.

పుట్టుకకూ చావుకూ మధ్య
బుడగల వలె వెలిగే బ్రతుకులు
శాశ్వతంగా నిలిచే కాలం
చాలా దూరం లేదనవచ్చు.

సురులకూ నరులకూ మధ్య
నరవరు లూహించిన భేదం
క్రమంగా తొలిగి పోవడం
ఖాయమనే చెప్పవచ్చు.

భావానికీ భౌతికతకూ మధ్య
భ్రమవల్ల కన్పించే వైవిధ్యం
అసలు లేకుండా పోయే రోజులు
ఆగమించినట్లే ఎంచవచ్చు.

నాకానికీ లోకానికీ మధ్య
ఓ కాలంలో చూపిన తేడా
మచ్చుకు లేకుండా పోయే కాలం
వచ్చినట్లే అనుకోవచ్చు.

# [illegible]. నా పాట

నా తెనుగు వాడలో
నా పూల మేడలో

నా తెనుగు వీణా శ్రు
తుల మీటి పాడెద !
నా తెనుగు జాతి ప్ర
తిభ చాటి పాడెద ! ॥నా॥

తెనుగు తల్లికి స్వర్గహారతుల వల్లి
కల నల్లి ప్రేమ పుష్పావళిని చల్లి,

తెనుగు జనాభ్యుదయ మార్గాన నడువ
ఘనశాంతి శౌర్యగానము వినిపించెద ! ॥నా॥

మృదుమధుర మధుగీతికల మ్రోసెద,
నవనవోజ్జ్వల రసమ్ముల నించెద !

తెనుగువాణి దివ్యనవ్య స్వరాన
నవనవామృత శ్రుతుల వీణారవాన
నవరాగ చైతన్య ఝురి వీచెద !
అవనీతలాన శాంతిని గూర్చెద ! ॥నా॥

# 2. అయిదు అయిదడుగులు

మానవుడు, యంత్రమ్ము ఒకటై
మార్పు చక్రము త్రిప్పుచున్నవి
శ్రమము, త్యాగము, భావిభారత
జాతిసౌధము నిల్పుచున్నవి.

చేతనప్రభ పూచె నే డా
సేతు శీతాచలము నిండుగ
ఎన్నో నవభావనల రాకెటు
లెగసినవి నా హృదయ రోదసి.

చీకటుల చెండాడి వెన్నెల
వాకలను పండించి రదిగో,
వెలుగు బాటలు వేసి భారత
వీరు లోకశ్రై నడిచి రిదిగో.

ఢిల్లిలో, ప్రతి పల్లెలో రా
జిల్లె నవ నిర్మాణ శోభలు,
గనులలో, క్షేత్రములలో కిం
కిణుల మ్రోసెను భాగ్యదేవత.

నదులు నదములు ప్రేమసాగర
హృదయలై ఆ కొండ కోనలు
వీడి వచ్చెను పల్లెసీమలు
చూడగా, వేడుకలు హెచ్చెను.

సాగరము పాలైన ఝురులే
శ్రమిక జీవుల నవ్య జీవన
సాగరములై — నాగార్జున
సాగరములై పొంగివచ్చెను.

రూరుఖేల, బిలాయి, దుర్గా
పూరులోన, బిహారులోన,
భారతీయార్థిక విధాన సు
ధీర తాల్చెను 'ఉక్కు కవచము'.

నా ఎడదలో నా గృహమ్మున
నవ్వె విద్యుద్దీప మాలలు
నేడు ప్రతి ఊరున స్థిరముగా
నిల్చె దీపావళి విలాసము.

ప్రతి భరత పౌరునికి విద్యా
మృతము ప్రాపును నేడు శారద
జీవితాశలు పండగా వ
ర్షించెను ప్రజాస్వామ్య నీరద.

మన దృఢమ్మగు ఏకతా బల
మునకు లోకము విస్తుపోయెను
మన సదాశయములకు తన సం
పదల చేర్చెను ప్రకృతి దేవత.

అయిదు అయిదడుగులే ముందుకు
అదుగో భారతజాతి సాగెను.
కాంతి చిమ్మెడి దివ్యసీమలు
కానుపించెను కనుల మేరల.

# ౧౨. జవహారులాలు

ఓ భారతదేశ మూల స్తంభమా !
ఓ మానవజాతి శాంతిబింబమా !

ఒరిగిపోయితివా నేడు నేలకు !
తరలిపోయితివా స్వర్గసీమకు !

జోహారులు, జోహారులు,
జోహారులు నెహ్రూజీ !
సర్వ మానవుల శ్రద్ధాం
జలు లివిగో పండిట్ జీ !

విశ్వ జనాశా జ్యోతిని
విషవాయువు లార్పెనా !
పుడమితల్లి హృదయంలో
బడబాగ్నులు నించెనా !

గగనలక్ష్మి దుఃఖ మేఘ
ముల దేలి విలపించెను,
మానవతయు, సమానతయు
దీనముగా శోకించెను.

నీకు ప్రియమ్మౌ హిమగిరి
నీరాజన మిడెను నీకు,
నేడు నదీనదములు క
న్నీటి గంగలై పోయెను.



ప్రతి దేశ పతాకలు శో
భా భరమున వంగిపోయె,
ప్రతి జీవన రంగము పే
ద తనమ్మున కృంగిపోయె!



బాలబాలికలు "చాచా
జీ" లేడని విలపించిరి;
పూలు, గులాబీలు నీ వ
రాల నవ్వులేక వాడె.



నీవు లేని భారతమ్ము
నే విధి ఊహింతు మయ్యా!
నీవు లేని ఢిల్లీ పురి
తావి లేని పూవయ్యెను!

నీ జీవిత లీలామృత
నీరధి వర్ణింప తరమె!
నీ వియోగ బాధ నుడుల
లో వివరించుట వశమా!

ఎవ రోదార్చెదరు మమ్ము
ఈశ్వర నిభుడా ప్రియతమ
నాయక రత్నమును కోలు
పోయిన ఈ దౌర్భాగ్యుల ?

కనులకు కన్పడవు గాని
కలవు నీవు జగ మెల్లెడ,
పలుకలేవు గాని ప్రగతి
పథము చూపుచుందు వెపుడు.

ఆ సంద్రములందు నదుల
యందె కాదు నీ మహాత్మ
కలసిపోయె దేశ కాల
ముల జీవిత నదుల కూడ.

నీ ఆశలు ఆశయములు
నెరవేర్ప ప్రయత్నింతుము,
స్వాతంత్ర్య సమైక్యతలను
శాంతిని పరిరక్షింతుము.

ఇంతకన్న నీ దివ్య
స్మృతి కేమిటి ఈయగలము ?
దీవించుము మమ్మెప్పుడు
దివ్యలోక భూషణమా !

## ౧౮. పొదుపు పిలుపు

పొట్ట మాడ్చుకొని నిన్ను
పొదుపు చేయ మనలేదు,
కట్ట బట్ట కోసమైన
ఖర్చు చేయ కనలేదు.

భావి జీవితమ్ము కూడ
భద్రపరచుకో మ్మంటిని,
నీ దేశం కొరకు కొంత
నిన్ను సాయపడ మంటిని.

మనిషి, యంత్ర మైక్యముగా
'మార్పు రథము' లాగాలి,
శ్రమము, త్యాగ ధనము చేర్చి
ప్రగతి పథము వేయాలి.

దారిద్ర్యము నుండి స్వర్గ
ధామము సృష్టింప లెమ్ము,
చీకట్లను పిండి కాంతి
లోకము నిర్మింప రమ్ము.

మన నదులను, మన గనులను
మన శ్రామిక జన బలమును
సర్వ సంపదలు కురిసే
జలదాలుగ మార్చుటకై —

పొదుపు చేయమంటిని, తృణ
మో పణమో ఇమ్మంటిని,
శక్తి కొలది నీదు దేశ
భక్తి చాటుకొమ్మంటిని.

# 5. అజేయుడు

ఓటమి నా కను నీడల
కోటలు దాటే కాలం
జగద్ఘోశమున గాలులు
చలియించే దాక రాదు.

శరదంబుదు డెవడో గ
ర్జన చేసెను నా కెదురుగ
నా ఉచ్ఛ్వాసా నిలాన
నలిగి నశించే దెరుగక.

పాపం తన కసి బాకును
నా పైకే విసిరె నెవడో
వజ్రాయుధమే నాకు
వశమై పోయిన దెరుగక.

నడి యాకాశమ్మున వె
ల్గెడి 'కాంతి నిధి' ని నాపై
కుటిలాత్ముం డెవడో చీ
కటి దుప్పటి కప్ప జూచె

పురిటిలోనె నిశా గోళ
మును కాల్చిన నన్నెరుగక.

నా కీర్తి కిశోరిని భ్రమిం
గాలని నాలో దూరెను
మానవ మృగ మెవడో తన
ప్రాణమె పోయే దెరుగక.

అమల సత్యమే రక్త
మై మ్రోప్రవహిస్తుంది నాలో,
వీరత్వము గాండీవపు
నారులైన నా నాడుల.

సౌందర్యము నా చూపుల
యందు వాసమై యున్నది,
అభ్యుదయం నా స్ఫుటమే
ధాకృతి గొని అవతరించె.

ప్రకృతిలోన నేను నాలో
ప్రకృతి లీనమై యున్నది,
నా ఓటమి ఈ జగద్వి
నాశమునకు సంకేతం,
నా వికాసమున లోకము
నాకమ్మౌతుంది నిజం.

# ౩. లాల్ బహదూర్

నడి రాతిరి నీ జాతిని
విడిపోయితివా !
ప్రతి గుండియలో దీపము
విడిపోయితివా !

అణ్వాస్త్రమ్ములను మించు
ఆత్మ బలమ్మును వహించి
కాలచక్రమును త్రిప్పిన
లాలు బహాదూర్ శాస్త్రి ! ॥నడిరా॥

జోహారులు జోహారులు
జోహారు లివే !
శోకావృత లోకాదృత
జోహారు లివే !

తల్లి భారతిని, సతీమ
తల్లిని లలితాదేవిని
భయశంకా శోకజలా
వర్తమ్మున త్రోసి నీవు ||నడిరా||

నెహ్రూజీ అస్తమయము
నించిన నిస్సహాయతా
తమమును దిగమ్రింగి, అమృత
ధారలు వెలయించినావు !

జయ కిసాన్ జయ జవాన్
జయ గర్జారవములతో
శౌర్యాగ్నులు లేపి భరత
జాతికి విజయమ్ము గూర్చి ||నడిరా||

కనులకు ఐదడుగు లెత్తు
కన్పించిన నేమి నీవు
ప్రతిభాద్యో శిఖరముపై
ప్రజా శక్తివే అయితివి

'తాష్కంటు' లోన శాంతి
తపసు జేసి, మానవతా
తీ తోన్నతి నంది స్వర్గ
తీర మెగసి పోయితివా ! ॥నడిరా॥

బద్ధ శత్రు వన్నవాడు
పరమ మిత్రుడైన వాడు
వంచినారు శిరములు నీ
భౌతిక దేహమ్ము నెత్తి,

మంచిని ప్రేమించినావు
మనిషిని ప్రేమించినావు
నిను ప్రేమించిన భరతా
వనికై బలియైనావు ! ॥నడిరా॥

నిన్ను కోలుపోయినట్టి
నర లోకము పేదవడెను
నిన్ను కూడ పొందినట్టి
సుర లోకము ధన్యమయ్యె,

'తాష్కంటు' నీ మహోజ్జ్వ
లాశయ కాంతి స్తంభము
నీ దివ్య స్మృతి మా కిల
నిత్యోదయ రవిబింబము ! ॥నడిరా॥

# 7. ఎగసిపోయే హృదయం

ఎగసిపోయే
నా హృదయమా !
ఎంత దూరము పోదువే ?
ఈ దిగంతా
లన్ని దాటి
ఏ జగాలకు పోదువే !

ఈ వసంతకుమారి నవ్వులు
ఇంతలోనే ఆరు ననియా ?
ఏడు రంగుల ఇంద్రచాపము
ఎంతసేపో నిలువ దనియా ?

ఆ సుమము చిలికించు గంధము
ఈ సుమము వెలిగించు అందము
కలిసి వెలిగే పూలకోసం
కలయజూచి నిరాశ జెంది. ॥ఎగసి॥

లేమితో పోరాడు పేదల
కేమి సాయము చేయలేక
పరుల కష్టము దోచు దనుజుల
శిరములను ఖండించలేక. ॥ఎగసి॥

బ్రతుకు బాధ సహించలేవు
మరణమును ప్రేమించలేవు
నేలపై కాలూనలేవు
నింగి శిఖరము చేరలేవు. ॥ఎగసి॥

నిన్ను వలచిన దాని నొల్లవు
నీవు కోరినదేమొ దొరకదు
వెలుగు చీకటి కలిసి తిరిగే
వింత లోకపు టంతు తెలియదు. ॥ఎగసి॥

నీవు కలగన్నట్టి లోకం
నిజంగానే చేరగలవో !
ఇన్ని ఊహాలతో తపించి
ఎండమావుల మీరగలవో ! ॥ఎగసి॥

# ౬. ఈప్స

పికవధూ ! నీ పాట విను ఓ
పిక రవంతయు లేదు నాకిక,
వినదలంచితి విశ్వమానవ
విజయగీతములు.

ఈ వనాంతర సీమ పూచిన
పూవులను గన తృప్తి గల్గదు,
వేచియుంటిని పేద బ్రతుకులు
విరియు నెపు డంచు.

చైత్ర పూర్ణిమ లోన నా ఎద
సంతసమ్మున పొంగ జాలదు,
కనదలంచితి శ్రమిక జీవుల
కనుల వెన్నెలలు.

శూన్య గగనములోన మెరిసెడి
చుక్కలం గని మురియజాలను,
అరయదలతు కుటీరముల భా
గ్యాల దీపములు.

సైకతస్థల విహారమ్ముల
శాంతి కల్గదు నా మనస్సుకు,
కోరుచుంటిని సమసమాజ 'వి
హార జీవితము.

ఈ తలిరు గాడుపుల డోలల
నా తనువు పులకింపజాలదు,
ఆశ కలదు ప్రజా ప్రమోదో
చ్ఛ్వాసములపైన.

ఈ వసంతోదయము గూరిచి
భావగీతులు పాడలేనిక,
ఈ దరిద్ర జనావళికి భా
గ్యోదయమ్మెపుడో !

# ౮. అనునయం

మృదు మధు గీతానుభూతి
ఎరుగని ఓ నా కలమా !
మధు మాసోషస్సులు రా
నున్నవిలే వగవకుమా !

నీ వ్రాసిన జీర్ణశిశిర
గీతా లాహ్వాన మొసగ
శుకపిక సమతా గాన
ప్లుత వాయు తరంగమ్ముల
నవ వాసంతోషస్సులు
తమము చీల్చి వస్తున్నవి. ॥మృదు॥

జర్జరతానల బాధిత
జీవిత సైకత పథాలు
అభ్యుదయ శ్యామల సీ
మా వీధులు చేరగనే
ఆ జీవిత శోభా కా
వ్యములను రచియింతువులే ! ॥మృదు॥

## 20. అలారం

చీకటి పుట్టల బుస కొ
ట్టుట నేర్చిన ఫణమా !
వెలుగు పూల పొదలలోన
విలయ నాట్యమేల్లా !

ఇవి తెన్నెరుగక తడబడు
బరిపదములు కావు సుమా
కదం త్రొక్కి నడచు ఇనుప
కాలి యగుడు లివి కనుమా !

కాటు వేయ చూశావా
కాల నలుగుశే సుమా !

చలి పీడిన మా చేతుల
తో నీ విషగళం నొక్కి,
కోరలూడ బెరికి చీ
కటి బుట్టలలోన నెట్టి,
నిలువున ఆడించేమా
నిలిపెదవా నీ విలయం ?

తూర్పు దిశా పాత్ర నుండి
తొణికిపడే కాంతి సుధల
కారుమబ్బువె త్రాగే
కాల మెపుడో పోయె సుమా !

కళ్ళు మూసు కెన్నాళ్ళు
పిల్లి పాలు త్రాగజాలు ?

# 21. ఏకధార

గోదావరి కృష్ణ నేడు
కూడి పాడగా,
ప్రతి ఆంధ్రుని ఎద సమైక్య
భావ మాడెగా !

జాతిని చీల్చిన గోడల
జాడ మాసెరా,
మూగవడ్డ వీణ తిరిగి
మ్రోయసాగెరా !

కలలు నిజములై కన్నుల
కాంతి నించగా
చరిత్రలో స్వర్ణయుగం
తిరిగి మొలిచెరా !

గతము నుండి గుణపాఠం
గరచి మెలగరా,
ద్వేషానైక్యతలు సమా
ధిలో పూడ్చరా !

ప్రేమవనం నాటు యశ
శ్రీలు పూయగా,
శ్రమామృతము చల్లు సుఖం
జాలు వారగా !

పగిలిన ప్రతి జాలిగుండె
పదిల పడెనురా,
ప్రతి జాతియు స్వీయగృహము
ప్రవేశించెరా !

జాతి జాతి కల భారత
జాతి మనదిరా,
శాంతి క్రాంతి కోరు తెలుగు
జాతి మనదిరా !

జాత్యైక్యత విశ్వ ప్రేమ
గీతి పాడరా,
నవ్య జీవితాభ్యుదయో
త్సవము సేయరా !

గోదావరి కృష్ణ నేడు
కూడి పాడగా,
మహాంధ్రోదయ సౌభాగ్య
మహిమ పాడరా !

# 22. పాడేరు పాట

చూడాలి చూడాలి చూడాలిరా!
పాడేరు నొకసారి చూడాలిరా!

గిరి నాయకుల గాథ
పరిరంభణములలో
వన బాలికలు శోభ
లను చిందు మధు సీమ! ॥చూ॥

కొండ కొండకు మధ్య
గుండెలన్నియు పరచి,
పచ్చ పచ్చని చేల
పండించు లోయలను ॥చూ॥

ప్రతి రోజు జలదాలు
పన్నీరు కురిపించ
అందాల సెలయేరు
లై ఆడుకొను భూమి

తొరిచేవ కన్యలు ఎ
దో శాపవశమున
చేపలై పడియున్న
"మత్స్యగుండము" నచట ॥చూ॥

పురివిప్పి నటియించు
గిరిజనాభ్యుదయమ్ము
నిదుర మేల్కొన్నట్టి
చైతన్య సింగమును ॥చూ॥

బ్రతుకులకు తేనియలు
పితుకు చెఱకు పొలాలు
లేమిని హరించు కా
ఫీ తోటల పసందు ॥చూ॥

అట పతులన్ని స్వే
చ్ఛా గానములు చేయు
అచటి గిరిజనము నా
ట్యా నందమున దేలు ॥చూ॥

అచట విద్యాదేవి
అడుగు పెట్టెను నేడు
వెలుగుతో చీకట్లు
వియ్య మందెను చూడు ॥చూ॥

అచటి అణువణువు నీ
కాహ్వాన మిడును రా !
అమృత హృదయముతో అ
చటికేగి రావాలి ! ॥చూ॥

# 22. హేతు గీతి

పర్జన్యం గర్జిస్తేనే
శంపాలత కంపిస్తుంది,
వాసంతం కుసుమిస్తేనే
వాసంతిక రవళిస్తుంది.

'న్యూయార్కు'లు బుసకొడితేనే
'ఆబర్ను'లు హత మౌతాయి,
ధన రాక్షసి కామిస్తేనే
రణ రావణు డుదయిస్తాడు.

ఆచారం గ్రహాచారంలో
పడి నీచంగా చావకురా!
కర్మమ్ముల ధర్మమ్ముల లో
మర్మము తెలియక చిక్కకురా!

# 24. అరకులో అభ్యుదయం

సృష్టికర్త రచించినట్టి
శిష్ట కావ్య పరిమళమ్ములు
అనుభవింప దలంచినావా ?
అరకు లోయకు కదలిపొమ్మా !
భారతావని ఎల్లెడల పొం
గారు నవచైతన్య సంపద
అరసి మురియ దలంచినావా ?
అరకు లోయను చూచిరమ్మా !

ప్రకృతి చేసిన తరతరాల త
పః ఫలమ్మా కొండదేశము
మన మహాత్ముని కలలు నిజమే
ననును ఆ గిరిజన వికాసము !
ఏ వనములందో వెలిగిపో
యే వసంతము మెల్లమెల్లన
తేమిరే డేలుకొను గిరిజన
గ్రామములు దర్శింపసాగెను !

చీకటులు గూళ్ళు కట్టిన గుడి
సె లందున కాంతులు హాసించెను,
కరువు బరువులు మోసి వాడిన
గిరిజనుల బ్రతుకులు సుమించెను.

ఏమి తోచక, కాలు నిల్వక
ఎచటనో తిరుగు సెలయేరులు
ఒక ప్రణాళిక వేసుకొని, క్షే
మకర మార్గము చూచుకొని, ఆ
గ్రామ భూములు నేడు సస్య
శ్యామలము కావింప తరలెను.

రకరకాల సుగంధ సుమములు
రమ్యమౌ రసభరిత ఫలములు
నిన్న మొన్నటిదాక మాడిన
మన్నులోనే పొంగి వచ్చెను.

మున్ను ఇచ్చట తపము చేసిన
మునుల అంబరములను పోలిన
నేలలో వ్యవసాయ తపమున
నేడు పచ్చలు పండసాగెను,
గంజినీళ్ళకు లేని వారల
గరిసె లపుడే నిండసాగెను.

అచటి కొండల మహోన్నత్యము
అచటి లోయల గభీరత్వము
అచటి ప్రజల సదాశయములకు
లొంగిపోయి, ప్రజా ప్రగతికై
మంగళా చరణమ్ము పాడును!

'పోడు' చేసీ, అడవి సంపద
ప్రోగు చేసీ, మోసగాండ్రా
బేరగాండ్రకు ధారపోసిన
బీదవా రా కొండవాసులు
తమ అవిద్యను, లేమిడిని ప
కముగ నేడు జయింపసాగిరి !

'గన్నెల' గ్రామమున విద్యా
కల్పవృక్షము పాదుకొన్నది,
నవ సమాజ వికాస బీజము
నాటుకొన్నది పల్లె పల్లెను.

వారి 'దిమ్సా' నాట్యములలో
వారి ఆటల పాటలందున
నిర్మలాత్మానంద భావము
నిరాడంబర జీవితమ్ములు
ప్రకృతి పూజా ధర్మ నిష్ఠలు
ప్రతిఫలించును, ఇంపు నించును.

బాట వెంబడి అడవులందున
పాట లల్లెడి పక్షిలోకం
రండి, 'అరకును చూడరండ' ని
గుండియలు పులకించ పిల్చును !
బయలుదేరుము మిత్రమా ! ఆ
భవ్య శోభలు చూడ నేడే !

# 25. కృష్ణవేణి

కన్నీరు తుడుచుకో కృష్ణవేణీ ! నీ
కష్టాలు ఈడేరె నమ్మా !
ఇన్నాళ్ళు కన్న నీ కలలన్ని నిజములై
ఆనందములు పండు నమ్మా !

అడవిపాలైన నీ అందాల బ్రతుకునకు
కడలపాలైన నీ సంసార సంపదకు
మంచినాళ్ళెతెంచె, మరచిపో గత గాథ,
మధురభావిని నీకు మరిలేదు ఏ బాధ.

నీవు దేశ చరిత్ర గర్భాన పుట్టితివి
ఒక మహాప్రస్థాన మెదియొ తలపెట్టితివి
ఏ నెరుంగుదు జీవన మ్మెందరికొ ఇచ్చి
ఎటు తోచ కీవె సంద్రము త్రోవ పట్టితివి.

నీ మహాగాన నిక్వాణమ్ములో కరిగి
పోయెను శతాబ్దా ల వెన్నో,
నీ సుధామయ పుణ్య తీరమ్ములో పెరిగి
పోయె సామ్రాజ్యా ల వెన్నో,
కాని నీ కొక ఆలయమును కట్టనెలేదు
నే నెరుంగుదు నీకు నిల్వ నీడే లేదు.

నీ దరినె గుండె తడి లేని భూముల జూచి
నీ ముందె ప్రజలు పస్తు పడుండుటను జూచి
నిలయమ్ము లేక వారికి సాయపడలేక
నీ ప్రచైతన్య ధారాశక్తి యంతయును
అడవి గాచిన వెన్నె లాయెనే యని ఎంత
గా పరితపించినావో నదీ జననీ !

నవయుగారంభోత్సవమ్ములో ఈనాడు
నవభారత ప్రభాత ప్రభాస్నాతులై
నీ బృహచ్ఛక్తి నిర్భరహృదయము గ్రహించి
తమ జీర్ణ జీవితాలకు సౌఖ్య మాశించి
నీ ప్రజాకోటి దృఢముగ నడుములు బిగించి
నిర్మించుచున్నారు నీకు బంగరుకోట.

అపర బుద్ధావతారు డగు నాగార్జునుని
ధర్మ ప్రబోధ ప్రతిధ్వనిత గిరిసీమ
విస్మృతేక్ష్వాకు సామ్రాజ్య నిర్మిత బౌద్ధ
విశ్వవిద్యాలయ కళాపునీత స్థలుల
నిర్మించుచున్నారు నీకు నాగార్జున
సాగర మహాలయము సౌందర్య నిలయమ్ము !

నీ కనులముందె కళకళలాడి ఆనాడు
కాల పర్జన్య సంపాత నిర్ఘాతముల
నశియించిన విజయపురము పునర్జన్మించి
నీ ప్రాంగణాన నిత్యమ్ము శోభించులే
అలనాటి బౌద్ధ శిల్పసుమాల మాలికల
నీ గృహ మలంకరింతురులే జనులు, తల్లి !

నీ సేవ చేయ పడవలు తిరుగు నీ యింట,
నీ భవన కుడ్యాలపై విశాల ప్రకృతి
సుందర సువర్ణ చిత్రాలు చిత్రించులే,
నీ నిలయ సౌందర్య గరిమ తిలకించగా
రసికులు, కళాప్రియులు, అభ్యుదయకాముకులు
దేశదేశాల నుండియు చేరవత్తురిలే.

నీ చూపు ప్రసరించు నంత దూరము నేల
పల్లవించు, శ్రుతించు నవ్యజీవన హేల,
నీ లాస్య జలపాత జనిత జీవన ధ్వనులు
నీ హాస విద్యుజ్జనిత కాంతి రేఖికలు
పట్టణాలను పల్లెపల్లెలో ప్రతి యింట
కలిగించు మోదమ్ము వెలిగించు భాగ్యాలు.

ఆంధ్రదేశమున కాశా శాంతి నిలయమై
నవ భారతాభ్యుదయమునకు సంకేతమై
బాధా దరిద్రాలపై విజయ చిహ్నమై
నీ భూరి సాగర సదనము వర్థిల్లులే,

నీ మహా గంభీర హృదయ సాగరములో
నీ తేనె కలలు అలలై ఎపుడు ఆడులే,
కన్నీరు తుడుచుకో కృష్ణవేణీ ! నీ
కష్టాలు ఈడేరె నమ్మా !

# 23. అదృష్ట దేవత

ఏ దారిని వస్తావో
ఏ దారిని పోతావో
ఎవరిని ప్రేమిస్తావో
ఎవరిని ద్వేషిస్తావో

ఊహింపగనైనలేము
ఓ అదృష్టదైవతమా !

దారిని పోయేవారికి
కోరి వరము లిచ్చెదవు
నిన్నె నమ్ముకున్నవారి
కున్న దూడిపించెదవు.

ఎంత నిరంకుశురాలవో
ఎంత పంతముల రాణివో
విజ్ఞాన ధనుల చేతను
వెఱ్ఱి పనులు చేపింతువు.

అజ్ఞానాంధులకు కూడ
అధికారము లిప్పింతువు
నీ నియమము లెట్లో కాని,
నీ న్యాయము లెట్లో కాని.

ఊరక ఒక నిర్దోషిని
ఉరికంబము నెక్కింతువు
హంతకుడగు వాని నొకని
ఆదరించి రక్షింతువు
ఏది న్యాయమో నీకు ?
ఏది ధ్యేయమో నీకు ?

నా కష్టఫలము మాత్రము
నాకు దక్కనీయవమ్మ !
నన్ను మింటి కెత్తకున్న
నవుల పాలు చేయకమ్మ !

# 27. చిరంజీవులం

కడలి అలల కలల పుట్టి పెరిగినాము
లలిత
కళల సౌరభాలు మోసి తెచ్చినాము

తీరవాసులం, దూర
తీరవాసులం మేము.

నేల బాస, గాలి బాస తెలుసు మాకు
నేడు
కానరాని వెలుగు జాడ తెలుసు మాకు

తేనె పాటలం, ప్రగతి
చేరు బాటలం మేము.

దండి నదులకన్న ప్రియము కొండవాగులే
మాకు
తమ్మి పూలకన్న ప్రియము రెల్లుపూవులే

పేద గుండెలం, మంచి
ప్రేమజీవులం మేము.

అందము, ఆనందమె కనులండి మాకు
ఊహ
కందని నేత్రమ్మె డెందమ్ము మాకు

కాంతి రేఖలం మేము
శాంతి వాకలం మేము.

ఓటమన్న దెపుడు మాకు ఉండబోదు
మేము
ఓడునాడు భావియన్న దుండబోదు

సిరుల మేరులం మేము
చిరంజీవులం మేము.

# 29. మా తార

అంద చందాలు మి
న్నంద ఆడే గగన
వాటిలో గల కోటి
కోటి తారకలార !
ఒకసారి మా తార
ముఖ దర్పణములోన
మీ ముఖమ్ములు చూచుకొందురో ?
కారు మ
బ్బుల దూరి దాగిపోకుందురో !

మా తార కన్గొనల
జ్యోతిస్సు కనువేళ
మీ కళ్ళలో కారు
చీకట్లు కనిపించు.

తారలని మీ కెవరు
దారపోసిరి పేరు
మినుకు మినుకున కునక
గనె తారకలు గారు
మా తార ముందు అణు
మాత్రు లౌదురు మీరు.

రివ్వు మని బొంగరము
రువ్వి మా తార వలె
పోటి బొంగరములను
పొడి చేయగలరే !

శ్రోతల ఎదలు రస
స్నాతాలు కాగ మా
తార వలె మీరు గీ
తాలు పాడేరా ?

ప్రకృతి పులకింప, చూ
పరుల ఎదలు ద్రవింప,
శింజినీ మంజు శిం
జితములను తార వలె
అసదృశ విలాస లా
స్యము సేయగలరే ?

నవరసమ్ముల మించు
నవరసమ్మును నించు
మాటలు వచించు ప్రవి
మల హృదయ మా తార
వలె మీ రొకటి యైన
పలు కాడ గలరే ?

తార లేపిన ఆ 'ప
తంగమ్ము' పై నుండి
నేలపై రాలి తా
రా లక్ష్మి జడపూవు
లై, కంఠహారమ్ము
లై, కాలి చిరు గజ్జె
లై, గోటిపై చుక్క
లై, ఆమె సేవింపరే ?
శూన్య గగ
నములోని ఓ తారలార !

తాడిత జగన్నిశా
తార అమృత ధార
తారా యశో జ్యోత్స్న
లో రమ్య తారలై
తార దేహ విభూష
తారలై వెలగండి !
కలకాలము జగాన
కళలు వెదజల్లండి !

# ౨౯. ఆశయ చిహ్నం

అదుగో ! అదిగో ! అదిగో !
అదిగో "మన ఆంధ్రా మెడికల్
కాలేజీ జీవన చిహ్నం"
మన ఆశలు, ఆశయములు ఆకృతి
దాల్చిన సుందర రూపం !

శాంతి సమత్వ ప్రచారక
సిత పతాంచల భావ కపోతం
అందాలను, ఆనందాలను
వర్షించే వెన్నెల మేఘం!

తన ముఖ కుంకుమ రాగము మనలో
ఘనసేవా శీలమ్మును పెంచును
తన గళహార ఫణీంద్ర మణిప్రభ
మన అజ్ఞాన తమస్సు హరించును.

తదీయ లోకన నిశిత శూలమున
రుజాజరా మరణాలు నశించును
తదీయ సస్యశ్యామల శోభల
ప్రకృతియెల్ల పులకించి హసించును.

ప్రక్కనున్న సాగరమెప్పుడు త
న్మంగళాభ్యుదయ గీతము పాడును
కొండపైని జ్యోతీరమ కన్నుల
పండువుగా హారతులను పట్టును.

జీవనామృతము పంచు వైద్య భూ
షణుల సృజించెడి కళాశాలనే
చిత్రించెడి ఈ చిహ్నము నీడల
నిలచి దాని మది కొలిచెదమూ!
నిరంతరము మన వైద్య సరస్వతి
విజ్ఞానాంబుధి తరచెదమూ!

# 30. ఆకాంక్ష

కోకిలా! నా పాట
కూడ వినిపించుకో!
నీ కంఠమే ఎంత
దాక మ్రోగింతువే?
నా వసంతానుభూ
తులను నే వినుతునే!

ఆ కొండ ఆ కోన
ఆ యడవి విడనాడి
ఓ నిర్ఝరీ! వేద
నానేక గిరులున్న
నా గుండెలో కూడ
సాగవా? మ్రోగవా?

ఈ కాళరాత్రి నిం
డా కాంతులను నించు
శంపాలతా! నా ని
శా జీవితాంగణము
లో కూడ ఆశాద్యు
తులు నింపరావా?

గగనమ్ము నుండి భూ
గర్భమ్ములో దూకు

ఓ 'నయాగర' గఖీ
రోరు జలపాతమా !
నా మనశ్చక్రమ్ముౖ
పై దూకి నాలోన
విజ్ఞాన విద్యుత్తు
వెలిగింపరాదా ?

నెలపాత్రలోని వె
న్నెల త్రాగ పయనించి
వశపడక వెనుదిరిగి
వచ్చే చకోరమా !
చెలికి నా మాటొకటి
చెప్పి వచ్చేవా ?

విరహిణుల ఎదలు కా
ల్చే వెన్నెలల నాపు
మేఘమా ! నా మేధ
లో కలవరము లేపు
భయద భావాల నా
పగ కూడ రావా ?

నవ్యజీవన గీతి
కామృతము కురిపించు
ప్రకృతి ! నీ విశ్వవీ
ణా కల శ్రుతులలో
నను గూడ శ్రుతిజేసి
కొని పాడుకొనవా ?

# 31. మహోద్యమం

మహా తపోనిధులార !
మహాత్ములార ! నేతలార !
నాకు స్వేచ్ఛ కావాలి
నాకు స్వేచ్ఛ కావాలి.

లోకపు చెరసాలలోన
లోహ బంధనాలలోన
బందీ మానవుడ నేను
బానిసల్లో ప్రథముణ్ణి.

నా శక్తికి, నా యుక్తికి,
నా కంటికి, నా బుద్ధికి
అడుగడుగున హిమనగాలు
అడ్డుతగిలి ఎదురు తన్ను.

స్వేచ్ఛ లేదు అని చెప్పే
స్వేచ్ఛ తప్ప స్వేచ్ఛ లేదు.

ఈ క్షణాన "న్యూయార్కు"ను
వీక్షించా లనుకొంటే
విమానాలు 'విసా' గిసా
వెక్కిరించి పోవు నన్ను.

తక్షణమే పారిస్ కా
మాతుల కలవాలంటే
కాలాంబుధి డబ్బు సంచి
గేలిచేసి మరలగొట్టు.

కాలేజీ చదువు పూర్తి
కావచ్చెను, ఏం లాభం ?
నన్ను చూసి రోడ్డుమీద
నవ్విన అమ్మాయి మనసు
లో చొరబడి ఆవిడ ఆ
లోచనల్ని చదువలేను.

చచ్చిన వాళ్ళందరి నొక
సారి వెళ్ళి చూసొస్తే
బాగుండును, కానీ ఇటు
బాటలు కట్టేశారు.

ఊహాల్లో ఊగులాడు
తున్న చుక్కలను సృష్టిని
అసలు వెళ్ళి చూడ్డానికి
అన్నీ అడ్డంకులాయె.

అంతెందుకు అయిదు రోజు
లాహారం లేకుండా
బ్రతకటానికైన స్వేచ్ఛ
గతి లేదాయెనుగా.

నా బ్రతుకును నిర్ణయించ
నాకె హక్కు లేనప్పుడు
స్వేచ్ఛ వున్నదనుకోనడం
స్వీయ ఆత్మవంచనం.

దేశానిక కాలానికి
దాసుడనై నాను నేను
భ్రమావరణమును నమ్మక
బ్రతికితి నిన్నాళ్ళు నేను
మతిచెడి శాస్త్రపు ఎంగిలి
మెతుకులతో తృప్తిపడితి.

స్వేచ్ఛకు దుర్నిర్వచనం
చేసి మోసగించలేరు
ఈ నా స్వాతంత్ర్యోద్యమ
మే శక్తులు నిల్పలేవు.

ప్రళయాందోళనం లేపి
ప్రకృతిని కల్లోల పరచి
బంధిత స్వేచ్ఛా మార్గ క
వాటాలను విప్పేస్తా!

ఆశల కాలోచనలకు
ఆకారం కల్పిస్తా!
స్వేచ్ఛా మానవ పథమున
సిద్ధుడనై జీవిస్తా!

# ౬౫. క్షుభితాత్మ

నా కన్నులు చెమ్మగిల్లునమ్మా!
నా గుండె ద్రవించిపోవునమ్మా!
ఓ కరుణామయి! నిను నే
ఆ కరాళ సంధ్యలోన
కాంచినది స్మరించు నపుడు
నా కన్నులు చెమ్మగిల్లు నమ్మా!

నీ చూపులు ఎంత గభీరమ్మో !
నీ హృదయమ్మెంత విశాలమ్మో !
నీ భావనలెంత పవిత్రమ్మో !
నేను గ్రహించితిని నమ్మ మమ్మా !
నా గుండె ద్రవించిపోవు నమ్మా !

ఒక ఆత్మీయునికై ని
న్నకలంక స్నేహ సుమము
అర్పింపగ నీయనపుడు
అలమటించు నిను తలచిన
నా కన్నులు చెమ్మగిల్లునమ్మా !

ఒక మానవుని బ్రతుకు చెం
తకు నీదు దయానురాగ
పరిమళానిల వీచికల
ప్రసరింపగ నీయ నపుడు
స్రుక్కిన నీ మూర్తి తలచి
నా గుండె ద్రవించిపోవునమ్మా !

నీ నిర్మల హృదయ కపోతమ్ము
ఈ నీచ విషాత్మక సంఘమ్ము

నీ విశుద్ధ వాఙ్మధు సారమ్మో
ఈ వికృతోగ్ర నీతి వర్షమ్మో
చూచి బ్రతుకు చితికిపోవు తల్లీ!
చుక్కవైన కావు, గగనవల్లి!

వేయి పవిత్ర చిత్ర భావములు
వివరించిన నీ ముఖ గ్రంథమ్మో
సరిగా తెలిసికొనలేదు నేను,
పొరపాటులు కలవరించినాను.

బ్రతుకు లోతులలో దూరు
స్మిత ప్రభా మాలిక లటు,
మానవతాత్మపై విసము
మసి పూసెడి భూతమ్మటు
వినోకించి కంపించితి తల్లీ!
వెర్రినైతి నేను, రాగవల్లీ!

ఈ వాసంతమ్మునీ ఉషస్సునీ
ఈ విద్యుల్లతికల పూర్ణిమలనీ
నీ హిమాలయోన్నత శీలమ్మును
నీ ఆనందకళా రూపమ్మును
ప్రేమింతును నిండు గుండెతోడను
సామాన్యుడనైన మానవుడను,
ఓ మానవతార్ద్రకల్పవల్లీ!
నీ మదిలో నిలవనిమ్ము తల్లీ!

# ౩౬. జీవనరాగం

చమురు లేని ఆ దీపం
చల్లారదు ఎందులకో !
తీగ తెగిన ఆ వీణియ
మ్రోగునింక ఎందులకో !

ఆకలితో ఈ చలిలో
చీకటిలో పడి మూల్గెడి
దీనుల కన్నుల ఆశా
దీపమ్ములు ఎక్కడివో !

వనధి సమాధిని చేర
వచ్చిన వాహిను లెందుకు
తిరిగి పారిపోవ ఇంత
తీవ్రముగా యత్నించునో ?

కాటిలోన కూడ బ్రతుకు
బాటవైపు ఆకర్షణ !
ఈ జీవన్మరణ సంధ్య
నెడతెగని ఏదో ఘర్షణ !

అబ్బా ! ఈ లోక మెంత
ఆశా భావోన్మాదిని !
రాబోయే రవి కోసం
రాత్రు లెన్నియో సహించు !

బ్రతుకు తీరమున నాలో
భాసించిన భావ మేదో ?
పొంగి పొంగి నా ఈ అను
భూతి గీతమై పోయెను !

# ౬౫. అమ్లాన సిమ్లా

మరపురాదు మరువలేను
మళ్ళి జన్మలోనైనా
సిమ్లాలో నే పొందిన
అమ్లాన మహానుభూతి!

అచటి వెన్నెలే వేరు
అచటి గాడ్పులే వేరు
అచట ప్రకృతి కూర్చుకొన్న
అందాలే వేరు!

వెన్నెల మధుపానమ్మున
మిన్నంటిన తెలికొండలు
గుండెలపై తేలి ఆడు
కొందురు వనకాంతలు !

చిరుగాలులు ప్రణయగాథ
పరవశలై లాస్యమాడు
కోటి కోటి లతికలు మధు
కుసుమ హస్త ముద్రలతో !

ప్రేమికులను దీవించుచు
వేల్పులు చల్లడి ముత్యపు
రాసులవలె శుభ్ర హిమ ప
రాగము కురియును అయ్యెడ !

పూలతోడ విద్యుద్దీ
పాలతోడ పరిమళించు
కొండలు కావవి ప్రకృతి
గుండియ లనిపించు నహో !

యువ దంపతులకు స్వర్గము
నవతకు పెట్టని దుర్గము
రాగము గల ప్రతివానికి
రసలోకమునకు మార్గము !

# 36. ఇరవై ఏళ్లు నిండె

పుట్టినాను భరతజాతి
పూర్ణ త్యాగ ఫలమై,
పెరిగినాను భరతమాత
ప్రేమరాగ లతనై,

ఇరు దేండ్లు నిండెను నాకీనాడు,
పరిమళించె అనుభూతులెవో నేడు.

తన ప్రాణముకన్న మిన్న
నను ప్రేమించిన గాంధిని
పుట్టి పుట్టగానె పో
గొట్టు కొంటిని,
బాలారిష్టముల నుండి
బ్రతికించిన సర్దారుని
వాలబుగ్గలపుడే విధి
వాలు చేసుకొంటిని,

ఎంత దురదృష్ట వంతురాలనో నేను,
ఇంతనాడె అంత కష్టకాలము చూచాను.

పండిత జవహరు ప్రతిభా
వజ్ర కవచమును ధరించి
ప్రజా శక్తి ప్రణాళికల
పాలబువ్వ సేవించి
ఆటపాటలతో దేశ
మంతటు వెలిగాను,
ఖండ ఖండములకు శాంతి
కపోతముల పంపాను,

మనిషిలోని దైవత్వము పెంచాను.
మండిపడే అసురత తల త్రెంచాను.

"లక్ష్మి ! స్వాతంత్ర్య మహా
లక్ష్మి" యని నను కొలిచిరి
"మా బతుకుల పండించెడి
మధు మాస"మ్మని తలచిరి
కులమత కలహముల విడచి
కులగిరుల విధము నిలిచిరి
కర్షకాళి, కార్మికాళి
కష్టపడే మానవాళి !

అయిదు అయిదు అయిదు అడుగులేశాను,
అసమానత మీద కత్తి దూశాను.

ఘన బ్రాక్రానంగల్, నా
గార్జున సాగరము లనెడి
నవజీవన భాండమ్ముల
నా భుజములపై ఇడుకొని
ఉరు భిలాయి రూర్కేలా
ఉక్కు కవచమును ధరించి
శాంతి విప్లవోర్వశినై
సౌభాగ్యవనము పెంచుట

చూచి మండిపడిన కీచకాధముల
పీచమడచి చల్లితి వెన్నెలల !

మీ ఆశలు ఆశయాలు
మీ ఆనందాకాంక్షలు
రూపించిన స్వర్గసీమ
చూపుమేర కనరాదని
వ్యథ పడతగునా ! సాగర
మథనమ్మొక నాడగునా ?
కాలాగ్నిని ఒక బిందువె
కాదా ఇరవై ఏండ్లన ?

స్వాతంత్ర్య మహా భారత జనులారా !
సాగిరండు ననువీడక ప్రియమార !

# 37. ప్రగతి గీతి

ఈ దేశం మనదేశం
ఎంత మారిపోయెరా !
ప్రజలు కన్న కలలెన్నో
నిజాలు అయిపోయెరా !

చేతి కందకుండ పరుగు
తీసే నదులెన్నో
ప్రేమతోడ నిల్పి బీడు
భూములు పండించెరా ! ॥ఈ దేశం॥

బండిబాట లేనిచోట
పడెను రైలు బాటలూ,
కాలిబాట లేనిచోట
కానబడెను రోడులూ. ॥ఈ దేశం॥

చమురు దీపములు సైతం
సరిగా వెల్గని పల్లెల
కంటికింపుగా వెల్గె క
రంటు దీపమాలలూ. ॥ఈ దేశం॥

దుక్కిదున్ను మోటలాగు
బక్క ఎడ్ల మొర వినెనో
అవతరించె ట్రాక్టర్లూ,
ఆయిలు ఇంజెనులూ. ॥ఈ దేశం॥

నానుగల్లు, బాక్రాలో
నందికొండ లోయలలో
నలిగిపోవుచున్నది ఇ
న్నాళ్ళ లేమి తాకాసి. ॥ఈ దేశం॥

రూరుఖేలలో, బిలాయి
లో, దుర్గాపూరులో
ఉక్కు పరిశ్రమల నుండి
ఉదయించెను నవభరతం. ॥ఈ దేశం॥

పంచవర్ష ప్రణాళికల
పథమందున ప్రజలంతా
సహకారపు రథముపైన
సాగిరదే! విజయముతో! ॥ఈ దేశం॥

ఊరూరా పాఠశాల
ఉచితవిద్య అందరికీ,
ఆరోగ్యం ఉద్యోగం
అవకాశా అందరికీ. ॥ఈ దేశం॥

మన భారత సమాజాన
మధుమాసం వికసించెను,
మన శ్రేయో రాజ్యలక్ష్మి
మంగళగీతులు పాడెను. ॥ఈ దేశం॥

భుజం భుజం కలిపి నేడు
ప్రజాబలం సాగుతోంది,
సహాకారం, సమానత
శాంతి, వెల్లివిరుస్తోంది. ॥ఈ దేశం॥

భరతజాతి చైతన్యం
కడలివోలె పొంగెనదె!
పంచవర్ష ప్రణాళికల
ప్రజాభ్యుదయ మయ్యె నదే!

ఈ దేశం మనదేశం
ఎంత మారిపోయెరా!
ప్రజలు కన్న కలలెన్నో
నిజాలు అయిపోయెరా! ॥ఈ దేశం॥

# 38. సందేహ వీచి

పికమునై వాసంత
మాధురులు గొందునా,
ఈ రూప సౌందర్య
మే తమసి గలియునో ?

మబ్బునై శంపా ర
మణితో సుఖింతునా,
సెలయేటి పాట లెం
తగ దూర మౌనో ?

దినరాజునై కమల
కన్యను వరింతునా,
రేయి కడలిని విరహ
వాయువులు కాల్చునో ?

కాలాహినై రాత్రు
సుల కాటు వేతునా,
రూపమ్ము గని మిత్రు
లే భ్రమసి కూల్తురో ?

## ౭౯. పరిణామం

సంవత్సరమంతా వా
సంతమ్మే శోభిస్తే
పికరవ సంగీతం క
ర్ణ కఠోరమ్మౌ నేమో ?

కోరినప్పుడెల్లా ఓ
కోమలి కౌగిలి లభిస్తే
ప్రణయ ప్రపంచంలో ఇక
పసయేమీ ఉండదేమొ ?

మరణ రోగముకు పక్కా
మందే కనిపెట్టబడితె
చావడం అనేది గడ్డు
సమస్య అవుతుందేమో ?

మరుపు అనే గుణం మనిషి
మనసు నుండి తొలిగిస్తే
చిరస్మృతులు అతని గుండె
చీల్చి కాల్చివేయునేమొ ?

నారీ వస్తువునే రచ
నల్లోన నిషేధిస్తే
రచయితలకు అసలు ఉప్పు
రాళ్లైనా పుట్టవేమొ ?

అధికారాలు లభించే
అవకాశాల్లేకపోతె
వినాయకుల సంఖ్య ఇంత
విపరీతం కాదేమొ ?

# 40. సినీమాలో చిన్నది

సినీమాలో చూచితి నొక
చిన్నదానిని
కలల అలలు రేపు మత్తు
కనుల దానిని.

మూలు రోడ్డుమీద అదో
మాదిరిగా నవ్వింది
చలచల్లని లోయల వె
చ్చని గాడ్పులు రువ్వింది.

ఉరు జఘనము బిగువు చనులు
సరితూగగ నడిచింది
వేల మన్మథులను కలచి
వేయు శరము విడిచింది.

మంచు పొరల వంటి పైట
మరచి జార విడిచింది
జగతిగోళ అమరగోళ
యుగళము ప్రకటించింది.

మెయి వంపులతో వలపుల
మెరుపువోలె మెరిసింది
నాలో ఒక భావ వసం
తమును నాటి పోయింది.

## [illegible]. ఆహ్వానం

కొమ్మలలో కోకిలమ్మ
కుహూ, కుహూ మన్నదే
నిన్ను నన్ను జంట గూడి
నేడే రమ్మన్నదే !

కొండమీద సెలయేటి
గుండె ఝల్లు మన్నదే
మనము ఆడి పాడకున్న
మనలే నంటున్నదే !

పచ్చని తోటల మోములు
వాడిపోవు చున్నవే
మన ప్రణయ విలాస వసం
తముకై వేచియున్నవే !

తెల్లని వెన్నెల మబ్బుల
తెరల దూరుచున్నదే
మన వియోగ విలయాగ్నికి
మండుచుంటి నన్నదే !

కడలి కెరటములు మనకై
కదలి వచ్చు చున్నవే
తీరమ్మున మనము లేక
తిరిగి పోవుచున్నవే !

చీకటి లోకమును జూచి
చంచల కంపించెనే
కంపములో మన గుండెలు
కలిసి కౌగలించెనే !

## 42. దాసోహం

కామినీ విలాస నటన
కథనమ్మె భువి చరిత్ర,
భామినీ విమాత్న నాట్య
భంగమ్మె ఈ ధరిత్రి.

ఇతిహాస పురాణాలు
సతి నిమిత్త కలహాలు
ప్రతి కావ్య ప్రబంధానికి
ఇతివృత్తం 'సతి శీలం'!

సామ్రాజ్యా లేలిన ఘన
సమ్రాట్టులు రణవీరులు
రమణీ దృగ్వల్లుల ఘో
రముగా బందీ లయారు!

నారాయణ మంత్రముగ్ధ
పారాయణు లౌ యోగులు
నారీ మధురాధరామృ
తా రాధకు లౌ భోగులు!

నీ లేమిని జగద్యంత్ర
మాగిపోవు ధూళి రేగు
చిక్కేద నీ కౌగిటిలో
ఎక్కడకూ పోను నేను
దాసోహం - దాసోహం
ఓ సఖీ! కళాముఖీ!
ప్రణయ వాహినీ! రాణీ!

# ౪౬. దీపగీతి

విలసత్తారా సుమాలు
విరిసిన గగనోద్యానం
ధరణీతల దర్పణాన
ప్రతిఫలించినట్లు తోచె!
ఈ రేయిని నా ఎదలో
ఎనలేని ప్రభలు పూచె!

సంజ కాంతులే దీపపు
పింజల రూపమ్ము దాల్చి
పశ్చిమాద్రి నుండి గృహ
ప్రాంగణాల దిగి వచ్చెనో?
చీకటి బ్రతుకులు ఆశా
స్మిత రోచులు వెలిగించెనో?

ఇరుల గుడిసెలో ప్రక్కన
సిరుల మేడలో సుమించె
సమరీతిని జ్యోతు లెన్నొ
సమతా భావము స్ఫురించ,
దీన జనుల తేమ కనుల
ధ్రువ తారలు ప్రకాశించ.

అడుగడుగున దిగ్జయ కా
హాళుల మ్రోత వినిపించెను
బాల బాలికావళి దీ
పాల వోలె కనిపించెను
ప్రతి రమణీమణియు సత్య
భామయై విజృంభించెను !

ప్రకృతి కన్యకే కన్నుల
పండువైన దీపావళి
స్వర్గమునే కాలదన్ను
సర్వ కళా శోభావళి
పులకించిన నా లోపల
పలికించెను కావ్యావళి !

ఏటేటా క్రొత్తదిగా
నే తోచును దీపావళి
ఏటేటా ఈ దివ్వెల
తోట క్రొత్త పూలుపూయు
దీపావళి శాంతి గృహో
ద్దీపకమై వచ్చుగాక
దీపావళి దీనజనుల
దీవింపగ వచ్చుగాక
దీపావళి దీపావళి
దివ్య నవ్య దీపావళి !

# 44. విజయశంఖం

"కనులు కలిగినట్టి, లోన
కనులు కలిగినట్టి కవీ !
నేడు కానరాని వెలుగు
జాడ లెరిగినట్టి రవీ !
విజయదశమి నీ మదిలో
వెలిగించిన భావ గీతి
వినుచు" మంచు నన్నాజా
పించెను ఆకాశవాణి !

వాణి చేతిలోని రాగ
వీణయైన నా హృదయం
పులకరించి అణువు అణువు
తొలకరించి పాడు నహో !

మనిషి జీవితమ్ములోన
ద్రాక్షజీవితమ్ములోన
మనిషి ద్రాక్షలను గను భూ
మాత జీవితమ్ములోన
శిశిర వసంతాలు చిత్ర
చిత్రముగా వచ్చిపోవు
విజయము అపజయము వెంట
వెంటనె నర్తించిపోవు.

ధర్మమునకు విజయమ్ము అ
ధర్మమునకు అపజయమ్ము
తప్పదు అంతిమ విజయము
తప్పలేదు మానవతకు.

పాడి వీడి నూరుగురును
ఓడినారు కౌరవులు
పాడి వీడలేని పంచ
పాండవుల కరాలలోన
శత మాయోపాయులైన
చౌలు అయూబు లనేకులు
చితికిపోయినా రొక శా
స్త్రీజీ ధర్మాస్త్రమ్మున.

పది తల లుండిన రావణ
బ్రహ్మ నీతి ఎరుగలేక
పతనమౌట నేటి భుజా
బలులకు పాఠమ్ము కాదె!

అణ్వాయుధ శక్తి కన్న
ఆత్మ బలమ్మే మిన్న
జాంబరులకు కాదు. దేశ
భక్తిని పెంచాలన్నా!
డేగల గని బెదరకు ఉ
డ్డీన శాంతి పావురమా!
ప్రేమ సుధలు వెదజల్లుచు
ద్వేషాగ్నులు ఆర్పుమా!

యుద్ధమ్మును కోరెకి దు
ర్యోధను లెందరో లేరు,
శాంతిని కాంక్షించెడి కృ
ష్ణార్జునులే కలరెల్లడ.

కోతి నుండి ఈ మానవ
జాతి పుట్టినది మొదలు
రాతియుగము నుండి నేటి
రాకెట్టు యుగము వరకు

సాధించిన విజయమ్ములు
శాశ్వత కాంతి దుర్గములు,
కలిగిన అపజయములు తుణ
కాల శరమ్మేఘమ్ములు.

న్యాయము కురుక్షేత్రమ్మున
నాటుకొనెను విజయవాటి,
వ్యాస భారతమున వాణి
వేసుకొనెను విజయపీఠి.

"అజంతా గుహాలు" చిత్రక
ళామతల్లి జయమాలలు
'తాజమహాలు' ప్రణయ దేవ
తా పూర్ణ విజయపతాక
ఆగస్టు పదిహేను స్వే
చ్ఛా లక్ష్మికి ఘన విజయము
సిమ్లా కాశ్మీరు ప్రకృతి
ఆమ్లాన విజయహాసము-

విజయపరంపరల స్వరూ
పిణియౌ ఈ విజయదశమి
విజయ మెపుడు కూర్చుగాక!
విశ్వశాంతికిని ప్రగతికి!